# SYAMANTHAKOPAKHYANAM

FROM

Erra Preggada's Harivamsam

Edited with Introduction and Notes,

BY

KORADA RAMAKRISTNIAH B.A

AND

ADIDAM RAMARAO,

*Maharajah's College, Vizianagram.*

Printed at K. S. Rao's. S. V. V. Press,

VIZIANAGRAM.

1920

 [Price 8 annas.

# ఉపోద్ఘాతము

పదునాల్గవ శతాబ్ది ప్రారంభమున నాంధ్ర సామ్రాజ్య లక్ష్మీధురంధరుఁడగు నోరుగంటి ప్రతాపరుద్రుఁడు ఢిల్లీ చక్రవర్తిచే నోడింపఁబడి చెఱపెట్టఁబడిన వాఁడగుటచే, నంతకుఁ బూర్వము రెండు శతాబ్దములనుండి శత్రు భయంకరులై మహాధీమంతులై పరిపాలనా దక్షులగు మహావీరులకు జన్మస్థాన మైనట్టియు, విద్యానాథాది గీర్వాణ మహా కవులకును, పాల్కురికి సోమనాథ, మారన, మంచన త్రిపురాంతకాది ఆంధ్ర మహాకవులకును ఉద్భట, హరీశ్వర రాఘవాది కర్ణాటక కవీశ్వరులకును నాశ్రయ భూతమైన భాషాపోషకుల కునికిపట్టయినట్టియు, కాకతీయ సామ్రాజ్యము భగ్నము కావలసి వచ్చెను. అప్పుడు ప్రతాపరుద్రునిచే నాయా మండలాధికారులుగ నియమింపఁబడిన నాయకులు తమ స్వాతంత్ర్యమును ప్రకటించుటచే నాంధ్ర దేశమున ననేక రాజ్యములు బయలు దేరినవి. అందు ప్రథమమున నాచన సోమనాథాది మహాకవుల కాశ్రయ మైనట్టియు, పిదపఁ బదునాఱవ శతాబ్దమున నష్టదిగ్గజములని ప్రసిద్ధిగాంచిన మహాకవులకుఁ బోషకుఁడై ప్రబంధ యుగమునకు మూలమై విద్వద్రాజ శిఖామణియగు కృష్ణదేవరాయని వలన దిగంతవిశ్రాంత కీర్తింబడసినట్టిదియునగు కర్ణాట రాజ్యము మొదటిది. నెల్లూరు మొదలుకొని సింహాచలము వఱకును గల భూమి నాక్రమించుకొని ప్రథమమున నద్దంకియుఁ బిదపఁ గొండవీడును రాజధానులుగ నూఱేండ్ల వఱ

తము బరిపాలించి యెఱ్ఱాప్రగ్గడ, శ్రీనాథాది మహాకవి పోషకులై జగద్విఖ్యాత యశస్కులగు రెడ్డిరాజ్యము రెండవది. ఈ రెడ్డివంశమున జనించిన దేవటివేముఁడు లేక ప్రోలయ వేమారెడ్డి యను నాతఁడు స్వదేశాభిమానమును స్వమతాభిమానమును గలవాఁడగుటచే నాంధ్రదేశమునకుఁదురుష్కుల వలనఁ గలిగిన బాధలను దొలఁగించి వైదికమతము నుద్ధరింప నెంచినవాఁడై “ తనకునద్దంకి యగురాజధానిగాఁ బరాక్రమంబున బహు భూములాక్రమించి ” రెడ్డి రాజ్యమును స్థాపించెను. ఈతఁడు క్రీస్తుశకము 1324 వ సంవత్సరము మొదలు 1350 వఱకును రాజ్య పాలనముఁ జేసియుండెనని శాసనముల వలనఁ దెలియుచున్నది. ఈతఁడు మిగుల విద్యాపోషకుండును, ఆర్యమత ధర్మములయం దత్యాదరము కలవాఁడునునై యనేకాగ్రహారదానాది సత్కార్యముల నొనరించుచు “ సన్మార్గైకపావనుఁడై వెలుఁగొందెను.” సకల కళా కోవిదులగు నుభయభాషా కవులచే నిండియుండు నీతని యాస్థానమున నీ యెఱ్ఱాప్రగ్గడయు నాస్థాన కవిగా నుండుటంజేసి యీతని కాలము పదునాల్గవ శతాబ్ది మధ్యభాగంబని మనము నిశ్చయింపవచ్చును.

‘ దురితహరు ప్రబంధ పరమేశ్వరునిఁ జెద’’
ల్వాడనిలయు నాదువంశకర్త
ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱాప్రగ్గ
డనునుతింప బ్రహ్మకును దరంబె’’

యని విప్రనారాయణ చరిత్రమును రచించిన మల్లన కవి చెప్పియుండుటచే ఎఱ్ఱాప్రగ్గడ యింటిపేరు చెదల్వాడ వారని మనకుఁదెలియవచ్చుచున్నది. ఇతఁడార్వేలనియో

గి బ్రాహ్మణుఁడు. నివాసస్థలము ‘‘పాకనాటిలో’’ (నెల్లూరుసీమ) నీలకంఠేశ్వర స్థానమై యెసఁగ మెసఁగు గుడ్లూరు. ఆంధ్రభారతమును రచించిన కవిత్రయములో నీతఁడు కడపటివాఁడు. నన్నయభట్టాంధ్రీకరింపఁగా మిగిలిన యారణ్యపర్వ భాగమును నన్నయ రచించి నట్లుగ నాతని పేరిటనే తెనిగించెను. ఇందుకు నన్నయ యారణ్యపర్వ రచనచే మతిభ్రమకలవాఁడై మృతినొందెనని యాకాలమునఁ బ్రబలిన వాడుకయే కారణము గావచ్చును. నన్నయభట్టారణ్యపర్వమును సంపూర్ణముగనే యాంధ్రీకరించెననియు, నడ తిక్కన కాలము వరకు బూర్ణముగ నుండుటచేతనే యాతఁడద్దానినిఁ దెనిఁగింపక, విరాటపర్వమునుండి మొదలు పెట్టెననియుఁ దిక్కన తరువాత నాభాగముత్సన్నమగుటచే నెఱ్ఱాప్రెగ్గడ దానిని పూర్తి చేసెననియుఁ జెప్పుట కలదు. కాని వీరిద్దఱికిని గలయంతరమేఁబది సంవత్సరములకుఁ దక్కువగనే యుండును. ఇంతస్వల్ప కాలముననే యంత ప్రఖ్యాతిఁజెందిన గ్రంథ మొక్కమాఱుగా నుత్సన్నమయినదనుట సంభావ్యము కాదు గావునను, ఎఱ్ఱాప్రెగ్గడయుఁ దానుస్వయముగ రచించుటకు భయపడియే కాఁబోలు దానికర్తృత్వము నన్నయమీఁదనే పెట్టి రచించుట చేతను నాభాగమాకాలమునకుఁ గొఱతపడియే యుండెనని తెలంపవలసియున్నది. ఈభారతారణ్యపర్వ శేషమును బ్రబంధరీతిని ‘‘చతుర్థోక్త పదంబుల’’ రచించుటచేతనే యాతనికిఁ ‘‘బ్రబంధ పరమేశ్వరుఁడను’’ బిరుదము కలిగినది విశేషముగ శివభక్తి కలవాఁడగుటచే నీతనికి శంభుదాసుఁడని బిరుదము కూడ కలదు. ఈవిషయము లీతఁడు తానుచి

యించిన „ నృసింహ పురాణము " తిక్కనవలె నొక స్వప్న వృత్తాంతమును గల్పించి యందుఁ దన తాత తనభావమున నావిర్భావంబు నొందిచెప్పిన ట్లీక్రిందిపద్యములందుఁ జెప్పియున్నాఁడు.

„ఉన్నత సంస్కృతాది చతురోక్తి పదంబులఁ గావ్యకర్తయై
యెన్నికమై ప్రబంధ పరమేశుఁడనంగ నగణ్యపుణ్యశో
భోన్నయ మంధ్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించితా
నన్నయభట్ట తిక్కకవి నాథులకెక్కిన భక్తి పెంపునన్॥

గిరిశ పదభక్తిరసత
త్పర భావము గలిమి శంభుదాసుఁడనఁగా
బరగిన గోవిందగుణా
దర సంభృత సౌమనస్య ధన్యుఁడ వెంగన్॥"

ఈ నృసింహపురాణమింక నీతనిచే రచియింపఁబడిన రామాయణ, హరివంశములవలె నరాంకితము చేయఁబడక అహోబలేశున కంకితము చేయఁబడెను. కావుననే దీనికహోబలమహాత్మ్యమని కూడనందురు. ఈనృసింహపురాణమునందును, హరివంశమునందును గూడ నీతఁడు నన్నయ తిక్కనల నిద్దరినే పూర్వకవులుగా స్తుతించియున్నాఁడు. ప్రథమమున నీతఁడు వేమభూపాలుని తమ్ముఁడై యాతని యొద్ద దండనాథుఁడుగనున్న మల్లారెడ్డిచేఁ బోషితుండై పిదప గుణగ్రహణపారీణుండును, భాషాపోషకుండును నగు వేమభూపుని యాస్థానముఁజేరి యాతని గౌరవమునకుం బాత్రుఁడ య్యెనఁట క్రింది పద్యములు నిదర్శనము లగుచున్నవి.

సకల భాషా కవిత్వ విశారదుఁడవు
సాధుసమ్మతుఁడవు నిత్యసౌమ్యమతివి

ధన్యుఁడవు గాన నీవీపుణ్యకథ
మెనుఁగిటిగ యొందుదు సెప్పు స.

అని వేమభూపాలుఁడు నెయ్యంపుఁగరంబు చేఁ బల్క

శా. నాతమ్ముండుఘనుండు మల్లధనీ ధుంకునిస్నాతత
శీతోడన్ సముపేతుఁజేసి యొలమిన్ జేపట్టి మాకిచ్చుటన్
జేతో మోద మెలర్ప రామకథముఁ జెప్పించి యత్యున్నమ
ఖ్యాతిం బొందితినింకనుండనియశేఁ గావ్యామృతస్వాదనన్

క౦. భారతపరాంశమని యిం
పారగఁ జెప్పుదురు బుధులు హరివంశమునీ
వారమ్యకథఁ దెనుఁగున
ధీరోత్తమ నిర్వహించి తెలుపుము మాకున్॥

అనిపలికిన నీత డును బులకిత దేహుండై

ఉ. నన్నయభట్టు తిక్కకవినాథులు చూపిన త్రోవ బావనం
బెన్న పరాశరాత్మజ మునీంద్రుని వాఙ్మయమాదిదేవుఁడౌ
వెన్నుని నృత్యమౌను కడువేడుకతో ఘనునాయకుండవి
ట్లన్నియు సంఘటించెద మదభీప్సిత సిద్ధికి రాజపుంగవా॥

అని పద్యోత్తరం బొసంగి హరివంశము నాంధ్రీకరింప మొదలిడెను.

ఈ హరివంశము 'భారతపరాంశమని బుధులు చెప్పుదురు గావున నీవు తెనిఁగింపుమని వేమభూపాలుఁడు పల్కుటచేతను, ఇది 'పరాశరాత్మజమునీంద్రుని వాఙ్మయమై " పర్వోత్కృష్టనాయకుఁడగు ' నాదిదేవుఁడౌ వెన్నుని వృత్తము"గుట చేతను నీతఁడీ గ్రంథము రచింపఁ దొడఁగినట్లు కనుపడుచున్నది. కావున నీకృతిపతి కృతి కాల నీవిషయమునఁ బ్రోత్సహించినది హరికథాలాపశ్రవణ,

శబ్దార్థక్లిష్టమైన రూపములు ధర్మైక గ్రంథగతయే. మఱియునిది భారతమునకును బంధముగుటచే నిది తెనిఁగింపక భారతామ్నాయ మాంధ్రమునం సంపూర్ణము కాదను తలంపుతో భారతము వలెనే సర్వజన సమాదరణీయంబగు పురాణశైలినే నన్నయ తిక్కనలు చూపిన త్రోవనే యవలంబించి రచించుటకు మొదలుపెట్టెను. ఈ హరివంశము మిక్కిలి గసవంతమై నాతికఠినమై యుండును. జాలవరకీతఁడు మూలకథననుసరించియే తెనిఁగించినను అక్కడక్కడ మూలమందలి కథలను విడిచియు స్వకల్పనలఁ జేర్చియు నాంధ్రీకరించినాఁడు పూర్వభాగమునఁ బృథుయయాతి మొదలగువారి చరిత్రలను, వరాహావతారాదుల సంక్షేపకథలను, పిదప శ్రీకృష్ణుని జననము ఆతని బాలక్రీడలు, సాహసకృత్యములు, రాక్షస వధలును వర్ణించి బలరామ కృష్ణులు సాందీపని యొద్ద విద్యాభ్యాసమును జేయుటతో ముగించెను. ఉత్తర భాగమును జరాసంధుని పరాజయముతోఁ బ్రారంభించి రుక్మిణీపరిణయము, నరకాసురవధ, పారిజాతాపహరణము, మధుకైటభాది రాక్షస సంహారము, ఉషానిరుద్ధయము, బాణాసుర పరాజయము, బలిని పాతాళంబునకుఁ బనుచుట యను విషయములతో సమాప్తినొందించెను.

ఇందీశమంతకమణికథ పూర్వభాగమున నంధకవంశక్రమంబు సంక్షేపంబుగాఁ జెప్పునందు నిఘ్నుని కొడుకులగు ప్రసేన సత్రాజిత్తులం బేర్కొని, యా సత్రాజిత్తుని చారిత్రము జెప్పు సందర్భమునఁ జెప్పఁబడియె. ఆంధ్రభాగవతంబునఁ జెప్పఁబడిన కథకు నిందలికథకును విశేషభేదము లేకున్నను పోతనామాత్యుని కథ యాతనికి

ప్రగణ మార్గమునందించుక భేదము లేక పోయెను. నన్నయభట్టం తకుఁ బూర్వము సంస్కారము లేక సులక్షణ విరహితమై యున్న యాంధ్రవాణికి సల్లక్షణ సంపన్నయగు సంస్కృత భాషాసంయోగముఁ గల్పించి తత్సాయమునఁ గవితా శిరోభూషణము నెక్కించి, యాంధ్రవాగనుశాసకుఁడై శాశ్వతకీర్తి నార్జించెను. ఆంధ్రమునకు దేవభాషచే మెఱుంగు వెట్టి దివ్యమగు తేజముతో దానిఁ బ్రకాశింపఁ జేసినాఁడు. భట్టారకునకుఁ బూర్వమున గల యాంధ్రకవిత కింత తేజస్సున్నట్లు కనుపడదు. ఈతని కవితయందు బహుళంబులగు సంస్కృతపదంబుల మధ్యఁ గొన్ని తెలుఁగు పదములఁ గూర్చుటచే నన్నయార్యోక్తి యంతసొంపు నాపాదించుచుండును. ఇఁక తిక్క, నయో యాంధ్రభాషకుఁ గల మెఱుంగులును, సొంపులును దీసి వైచి దాని నైజవిలాసములను జూపినాఁడు. సంస్కృత పదముల సహాయము లేకయే కొన్ని యచ్చ తెనుఁగు పదములకూర్పు నేర్పుచే సంబుస్ఫుటిలఁ జేయు సామర్థ్య మీతనికి గలదు. తిక్కన చేతిలో నాంధ్రవాణి విశేషముగ నెఱుఁగుసొమ్ము లక్కఱలేకయే సహజ సౌందర్యముచే బ్రకాశించు నంతటి ప్రౌఢ యైనది. ఈతని యోగులయున నీమెతన సహజశక్తు లన్నియు ఘటిలుపఁబడి యొకవిధమగు స్వాతంత్ర్యమును సంపాదించు కొనెనని చెప్పవచ్చును. ఇప్పుడు “ కిమివహి మధురాణాం మండనం నాకృతీనాం ”— సహజముగ మధురమైన యాకారము (సౌందర్యము) కలవారికి ఏవస్తువలంకారము కాదు — అని కాళిదాసు చెప్పినట్లుగా, సంస్కృత పదములకంటె రెండు మూఁడు రెట్లధికముగ సహజ మాధుర్యముగల తెలుఁగు

దములమధ్య నా సంస్కృత పదములు మండన (అలంకార) స్థానీయములై తామునుదత్సం స్థమునఁ బ్రకాశించినవి. నన్నయ సహజముగ నాంధ్రదేశీయుఁడు కాకుండుట వలననో, యాతనికి సంస్కృత భాషాభిమానము హెచ్చయి యుండుట వలననో, యాదివఱకుఁ దగిన సంస్కారము లేని కారణమున నప్పటి భాషపటువగు శైలి కలవడ కుండుటచేతనో, నన్నయ సంస్కృతము నెక్కుడుగఁ గలిపియున్నాఁడు. తిక్కన సహజముగ నాంధ్రదేశీయుఁడు. ఉభయభాషల యందసమాన ప్రజ్ఞ కలవాఁడు. కావున నన్నయకంటె నీతకిఁ దెనుఁగు ప్రయోగమున నెక్కుడభిమానము కలిగినది. తెనుఁగు పదముల కూర్పునందధిక చాతుర్యము కలదు. తెలుఁగున జాతీయప్రయోగ సౌలభ్యము తని కలవడినట్లు తని కలవడలేదు. కావుననే యీత డాంధ్రభాష అన్య భాషాశ్రయము లేకయే యాసాంపుల నన్నిటిని స్వశక్తిచేస మకూర్చుకొనఁగలదని సూచించుచు స్వకీయభాషా స్వాతంత్ర్యమును బ్రకటించినాఁడని చెప్పవచ్చును

ఇక యెఱ్ఱాప్రగ్గడఁ గవిగారి విషయమున నన్నయ తిక్కనలే గురువులని చెప్పఁబడినది గదా; వారు చూపినత్రోవయే పావనమైనదనియు నీతఁడు చెప్పియున్నాఁడు. ఈ గురువులలో నొకరు సంస్కృతముతోడి విశేష సంబంధము వలన నీభాషకుఁ గలిగిన గౌరవము, మాధుర్యము, గాంభీర్యము మొదలగు గుణములను జూపియు, వేఱొకరు సంబంధము లేకయే స్వభాషా పదములకుఁ గల లాలిత్యము, రసోద్బోధక శక్తి మొదలగు గుణములఁ జూపియు నాంధ్ర

కవిత్వమందు రెండు త్రోవలు కల్పించిరి. రెండును దేనికది యతిగమ్యంబులగు త్రోవలె. కావున వీరిద్దరి కవితారీతుల ననుకరించుటకై గాక నీతఁడు సంస్కృతాంధ్రముల దాదాపు సమభాగములఁ గలిపినాఁడు. ఆంగ్లవాఙ్మయమున మిల్టన్ Milton మహాకవిని గూర్చి డ్రైడెన్ Dryden అను కవీశ్వరుఁడు చెప్పిన

*"Three Poets three distant ages born*
*Greece Italy, and England did adorn*
*The first in loftiness of thought surpassed*
*The second in majesty in both the last.*
*The force of Nature could no further go*
*To make a third she joined the other two*

రీతి నాంధ్ర కవితా విషయమునఁ బ్రామాణిక కా గ్రంథములగు కవిత్రయము వారిలో నన్నయ తిక్కనలు తీసినత్రోవలు రెండు సత్యుత్కృష్టములయ్యెను, నామహాకవుల సమాంశములచే నీకవిత్రయమున మూఁడవవాఁడగు నెఱ్ఱాప్రెగడయు, వారి కవితారీతుల సమ్మేళనముచే నీతని కవితా రీతియు నేర్పడెనని మనము తలంప వచ్చును. కాని యీతఁడు సహజముగఁ దెలుఁగు దేశము వాఁడగుటచేఁ గాఁబోలు తిక్కన మార్గమునందధికాదర మున్నట్లు గన్పడును. నృసింహ పురాణము నందును, హరివంశ మునందు నీతఁడు వాడిన తెలుఁగు పదముల బాహుళ్యమే యిందుకు నిదర్శన మగుచున్నది.

ఈ హరివంశమందలి యుత్తరభాగ నిర్మాతతో నించుమించుగా సమకాలికుఁడై, కర్ణాట రాజ్యమున బుక్కరాయల యాస్థాన కవియగు నాచనసోమనాథుఁడు "ఉత్తర హరివంశము" పేరుతోఁ దెనిఁగించెను. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము పూర్ణముగా నుండలేదను నభిప్రాయముతో నీతఁడీయుత్తర హరివంశమును రచియించెనని చెప్పుదురు. ఏదెట్లయినను సోముని గ్రంథ మెఱ్ఱాప్రెగ్గడ గ్రంథము కంటె మిగుల ప్రౌఢమైన దనుటకు సందియము లేదు. కాని యది ప్రబంధశైలిని ప్రౌఢముగ రచింపబడిన దగుటచే హరివంశము వలె సర్వజనైక వేద్యము కాదు. ఎఱ్ఱాప్రెగ్గడ ప్రబంధపరమేశ్వరుఁడని బిరుదు వహించి, తన హరివంశము ప్రబంధమని చెప్పినను, దీనికంటె సోముని గ్రంథమే ప్రబంధరీతులను గలిగియున్నదని తలంపవలయును. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమును" భారత శేషాంశమగుటచేఁ గాని సర్వజన సమాదరణీయమగునటుల మృదుమధురములగు రచనలతోఁ బురాణశైలిని రచియించి భారతామ్నాయమును సంపూర్ణముగాఁ దెనుఁగులోనికిఁ దెచ్చిన వాఁడయ్యెను. సోముని పని యిది కాదు. హరివంశమందలి కథాభాగముల నే తీసికొని యంతకంటె రసవత్తరంబుగ విశేష కల్పనలఁ గూర్చి రచియించి, తన ప్రతిభా విశేషమును బ్రకటింప నొక విధమైన యపూర్వంబగు స్వతంత్ర గ్రంథమును వెలువడఁ జేయవలయునని యే యాతని యాశయము. కావున గ్రంథ రచనోద్దేశమున నే వీరికిరువురకును గొంత భేదము గలదు. స్వాభిప్రాయము ననుసరించియె సోముఁడు తాను రచింపఁ దలఁచిన గ్రంథమునకు వలయు సామగ్రి సంగ్రహము నొనర్చెను

హరివంశము నంతను మరల తీసి దీని జనింగించ దలంచుకో లేదు. కావుననే పూర్వభాగమునంతయు వదలివేసెను. ఉత్తరభాగమునందైన కృష్ణునిచర్యలలో రసవంతములను, కేవల కల్పనా చాతుర్యమును, వర్ణనా పాటవమును చూపుటకు ననువుపడినమాత్రమే గ్రహించి స్వతంత్రముగ నొక ప్రబంధముగ రచించెను. ఎఱ్ఱాప్రెగడ హరివంశ పూర్వము నంతను, నరణ్యపర్వము నన్నయ తిక్కనలు భారతమునం దవలంబించిన రీతినే సర్వజన సమాదరణీయముగునట్లు రచించి భారతామ్నాయమును సంపూర్తి చేసి యాంధ్రభాషయందు వన్నికఁగాంచెను. నన్నయచే మొదలు పెట్టఁబడిన భారతాంధ్రీకరణము రెండువందల యేండ్లకీ మహాకష్టకాలమున సంపూర్తి యగుట తటస్థించినది. ఇట్లార్యమతాభిమానుల కత్యంతాదరణీయములగు భారత రామాయణము లీతనికాలమున నాంధ్రమున సంపూర్ణములగుటచేత నన్నయ తిక్కనల యంశమున నావిర్భవించిన యీతఁడు వారిరువురు ప్రారంభించిన కార్యములను కొనసాగించి యాంధ్రావళి కత్యంతామోదమును గూర్చువాఁడయ్యెను.



పుచ్చి యాతని యఱుతం బెట్టి వరంబు వేఁడుమని
పలికిన.

క. అతఁ డమ్మణి ఝూగియ యాభి
మతపగముగ నడుగుటయును ♦ మార్తాండుఁడున
ట్ల తగంగ నిచ్చి యంత
ర్హితుఁడయినఁ బ్రమోదమాత్మ ♦ నెపకంబెసఁగన్.

వ. మగిడి సత్రాజిత్తు ద్వారకానగరంబునకేగుదేరంగని
యెల్లవారును సవిస్మయసమ్మోహ సంభ్రమంబులం
గమలనాభుపాలికిం బోయి.

క. దేవర దర్శించుటకై
తావచ్చుచు నున్నవాఁడు ♦ తపనుండిదె తే
జోవిసర మెసఁగ నవనిని
యావిభుఁ డల్లనగి వార ♦ లందఱతోడన్.

వ అతని వర్ణప్రసాదలక్షత్నుండైన సత్రాజిత్తుంగా
నెఱింగించె నట్లు సనుదెంచి సరోజినీబాంధవసఖుం
డు సుఖంబున నుండునంత.

ఉ. నిచ్చలు నమ్మహామణి వి
ర్మలకాంచన రత్నభారముల్
పొచ్చెము లేక యిమ్మెడిది ప్రి
భూతగ్గుగాఁ గురియున్ ధరిత్రిఁ దా
నెచ్చట నుండె నచ్చటికి
నేయూపద్రవము నేథయంబు నే
యచ్చిరయున్ జనింపక స
మంచిత సుస్థితినిచ్చు నిచ్చమ్.

బ్భంగిన్ గణం బేకవిం
శతిసంఖ్య కలితాహముల్ హరికి బు
త్రుస్వామికిం జెల్లఁగన్.

వ. యాదవేశ్వరుని యనుచరులచ్చట నెనిమిది దివసంబు
లు గాచికొనియుండి బలదేవానుజుఁడు బిలాంతరగం
బు వెలువడఁడయ్యెఁ బాపిణం బులతోఁ నున్న నివా
శ్యేల తడయునసుచుం జేటువొచ్చి మగిడిపోయి కృ
ష్ణుండు నిహతుండయ్యెనని చెప్పిన.

క. శోకించి చుట్టములు పర
లోకఃధులు సమర నిర్వి ◆ లోపతవిహితా
నేకతిల పిండ దానము
లాకృష్ణున కటనొనర్ప ◆ నాహ్వయనమున్.

వ. దానంజేసి యాతండు సత్వహానిం బొందక యొప్పటి
యట్లయుండె జాంబవంతుండు నిరాహారత్వంబు క
తమున బ్రబల సంప్రహార భేదంబులవలననుబలహీనుం
డైయోటువడి యద్దేవునకుసాష్టాంగ ప్రణామంబొనర్చి.

మ. సురగంధర్వ భుజంగముఖ్యాచర ర
క్షోముఖ్యులు నీపదసం
బరిభావంబొనరింప నోపరని మ
ద్భావంబునం దోఁచె న
వ్వరు తిర్యగ్భవులైన యాదృశులు దే
వా నిన్ను మత్స్వామి దా
శరథిం బ్రాప్తపునస్సముద్భవునిఁగా
శంకించెదం జెప్పఁగే.

క. అనిన నగుచు నఘుఁ డా
యన కాత్మావతరణంబు • నఖిలము నెఱిఁగిం
చిన వాఁడు భక్తసఖు
గ్రావలు దగ నొనర్చి యధిక • సమ్మోదమునన్.

వ. తదీయ కరతలస్పర్శనంబున నాయత సమశ్రమంబు
నుజ్జగించి ఋక్షేశ్వరుండు.

క. తనకూఁతు జాంబవతి నాఁ
జనుకన్నియఁ దెచ్చి యిచ్చె • సన్నుతహాత వ
వ్వన కెక్కిణువను నతఁడును
వనజాక్షుఁ బరిగ్రహించె • వాంఛరొయిలర్పన్.

శ్రీకృష్ణుఁడు జాంబవతిం బరిగ్రహించి నిజ
పురంబునకు వచ్చుట.

వ. అట్లు శమ్యాగత్నంబు నివేదించిన యనంతరంబ శ్యా
మంతకరత్నంబును సమర్పించినం బ్రీణతుని చేతిదగో
వఁదగదయినను బరివాదపరిహారార్థం బయ్యర్థవిదుం
డున్గైకొని చరితార్థుండై జాంబవతిందోడ్కొని పురం
బున కరుగుదెంచిన.

ఉ. పౌరులు బంధుమిత్రులును
భాగ్యఫలంబులు నేఁడు మాకు నిం
డాఁగఁ బండె నచ్యుతుఁ
డపాయ మొకింతయు లేక యిమ్మెయిం
గర జగంబు లన్నియును
దీకుఁగ జేకొతమంచు సమ్మన

కౌనకా కృష్ణనిపొమ్ముఁ జేసి ఖలుఁడై
కూఁతున్ సహింపంగ వ
చ్చునె యూహిం విచారమేమిటికిఁ దు
చ్ఛున్ వీనిఁదు:ఖింగించి యెం
దు నలభ్యంబగు మానికంబుగొని సం
తోషింత మంత్రతిన్.

చ. ఎఱుఁగనివాఁడ పోలె వారి
యివ్విధి యూరకమూచెనేని లే
కుఱక మనంబులోనఁ బగ
యూఱుడుచందమ్మయెనఁ జేర్చి యం
దఱమును నొక్కడై కలసి
దప్పఁగఁబాయుద మెవ్వ రెక్కడే
నొఱగిన వారికెల్లఁ దగ
నోర్తుము నిశ్చయమిట్లు దీనికిన్.

వ. అనిననతండు నవ్వానంబున కియ్యకొనియె జనార్దనుం
డు జతుగృహదాహంబునఁ గుంతీనందనులు మ్రింది
రనువార్తవిని తాను బరమార్థవేది యయ్యును దు
ర్యోధనబుద్ధికి నిజంబు గాఁపించుటకై వారణావతం
బునకుఁ బోవ్రటయు రంధ్రాన్వేషి యగుటం జేసి.

శతధన్వుఁడు సత్రాజిత్తుంజంపి శ్యమంతకమణి
నపహరించుట.

తే. అల్ల యుచరితు సత్రాజిత్తు • నధమరాత్రి
నిప్పుడైయున్న వధియించి • లుబ్ధగర్వుఁ

డైన శతధన్వుఁడతని య ♦ నఘుఁడాదివ్య
వినుత మాణిక్యరాజంబు ♦ గొనుచుఁ బోయె.

సీ. తండ్రిఁ జంపినఁ గడుఁ ♦ దఱికి యత్యంతవే
గముగల గుఱ్ఱముల్ ♦ గట్టినట్టి
తేరెక్కి చెచ్చెర ♦ వారణావతమున
కరిగి యా తెఱఁగు వా ♦ రాయణునకు
సర్వంబు నెఱిఁగించె ♦ సత్యభామాదేవి
వాసుదేవుండు న ♦ వ్వామనయన
మనములో నున్న యు ♦ మ్మలికమ్ము మాన్పెదు
పంతంబుమాటలో ♦ కొంతకొంత
పడకయుండంగఁ బలికి య ♦ ప్పడఁతిఁ గొనుచుఁ
బురికిఁ జనుదెంచి యేకాంత ♦ మునహలాంకు
తోడఁ దలపోసి శతధన్వుఁ ♦ దునిమి యతని
చేతిరత్నంబు గొనుపని ♦ సేయఁదలఁచె.

వ. అట్లయ్యిద్దఱుఁగూడి కీడొనర్ప నుద్యోగించుతెఱఁగు యెఱింగి శతధన్వుండు వారితోడిపోరునకుఁ జెన్నుఁబ్రాపైనిలుచునట్లు కృతవర్మ నడుగంబోయిన నతండియ్యకొనక బలదేవ వాసుదేవులతోడ విరోధంబునకుఁ దానోర్వమి దెలియంబలికి నక్రూరుం గలసికొను వాఁడైన నతండు.

మ. అనురీహారమృణాళహంసము మహేం
ద్రాంతఃపురీ కర్ణ చ
త్రిపమున్మృలన మూలశిల్పి కుమతధ్వాం
తార్కబింబంబుడు

ప్రియవహం బెవ్వనిచక్రి మట్టిహారికిం
బ్రత్యర్థికాయై నిల్వఁగా
వసమే యొంతటివానికిన్ వెఱతు న
న్నెవ్వారిస్యాఖ్యం బూనఁగన్.

వ. ఏనతని శరణాభిలాషకుండ దోషాచరణంబునకునెట్లు గడంగుదు వెడంగనయియున్న మీతలంపునంగలసితి నవియున్నియు నప్రియోజనంబు లనిన శతధన్వుండ శ్లేని నాకునిక్కడ నన్యుండు రక్షకుండు లేఁడు తొలఁగిపోయెద నీవీయలభ్యరత్నంబు డాఁచ వలయుఁ బ్రాణంబుపైవచ్చునంతటి పోరామియందును నెవ్వరికి నెఱింగింపకుండునది యని యొడంబఱిచి యాతని చేతికిచ్చి యాపొద్దు పురంబువెడలి పూర్వోత్తరదిశాభిముఖుండై.

శతధన్వుఁడు కృష్ణునకు వెఱచి తురగారూఢుండై
పాఱిపోవుట.

క. తనకు నొకనాట శతయో
జనములు చనఁబ్రాదయగతి ల ♦ వత్తురగనితం
బినికలిమి దానినెక్కి ప
వనసమగతిఁ జనియె మనసు ♦ వడఁకఁగభీతిన్.

ఉ. అంతనెఱింగి శౌరియు స
హాగ్రజుఁడై రథమెక్కి యయ్యవి
శ్రాంతుని వెన్నడించఁదగులఁ
గాఁ దనపోయెడు దవ్వుపోయి తా

నంతటఁ బోవలేక నృపతిఁ
బొందె హయాంగన భోజవర్యుఁడు
శ్రాంతతఁ బాదచారియయి
పాఱెఁ దేహపురంబు చేరువన్.

క. కనుఁగొని కృష్ణుఁడు బలదే
వునకిట్లను హయములేఁ దె ♦ వులు గడువేసమైఁ
జననిచ్చుట గాఘన నీ
వనఘా కొనిరమ్ము రథము ♦ నల్లన వెనుకన్.

తే. విగతవాహనుఁడైన యి ♦ వ్విమతుఁడోపు
కొలఁది మెల్లనఁ బాఱెడుఁ ♦ గూడముట్టి
పట్టికొనియెదననిన న ♦ బ్బలుఁడు నట్ల
కాక యన డిగ్గనుఱికి యా ♦ కంసరిపుఁడు.

క. కొంతదడ వరిగి వెనుకొని
యంతటఁ గడునలిగి యాతఁ ♦ డాశతధను న
త్యంతక్రోధంబున మద
శాంతింపక తునియనేచెఁ ♦ జక్రము చేతన్.

వ. ఇట్లు తలదుఱించి శతధన్వుం జేరఁ బోయి.

క. తలయును జీరయు నొరయ మొ
దలుగా శోధించి చూచి ♦ తత్తనువున న
వ్విలసిత రత్నము గానఁడ
హలధరుఁడును గూడవచ్చె ♦ నంతటిలోనన్.

వ. అతండవ్విధం బతనికిం జెప్పి శతధన్వవధంబు వితథం బయ్యెనను పలుకుపలికిన నదిబొంకని తలంపునఁ గటకటంబడి బలుండు.

తే. అకట వెఱ్ఱివైతిగదయ్య నీ ♦ యట్టివాఁడు
నిస్సిగ్గొ యింతమాత్రకు ♦ నిట్టిదయ్యెఁ
బలుకఁ జేటికి నీతోడ ♦ భ్రాతృధర్మ
మింకనింతియచాలు నీ ♦ యిచ్చఁజనుము.

వ. అని యతని శపథవాక్యంబులు విశ్వసింపక సాంత్వనంబులు గైకొనక యుమ్మలికయాలే నెఱుంగనియుఃయొయుడుగుమని పోసి యొక్కరుండును మిథిలాపురంబునకుం జని జనకరాజుచేత సత్కృతుండై తత్సదనంబున నుండె నెన్నుండును శైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకంబులను రథ్యంబులుగల యా దివ్యరథంబుతోడమగిడి ద్వారవతీపురంబునకు వచ్చెనక్కడ.

క. వైదేహపురనివాసు మ
హోదగ్రమహస్త్వ సాత్వ ♦ తాగ్రణిఁ ఘనుఁడా
మోదరపూర్వ్యుఁ గానం
గా దుర్యోధనుఁడువచ్చి ♦ కడువినయమునన్.

వ. సవిశేషార్చనాతోషితుం గావించి యతండాచార్యుండుగా గదాకౌశలంబంతయుం గుదిముట్ట నభ్యసించె నంతఁ గొంతకాలంబునకు సుగ్రీసేనాది యాదవవృద్ధులు రత్నంబు కృష్ణునకుం జేపడమి లెస్సగా నెఱింగి పోయిబలభద్రునికవ్విధంబు దెలిపి యతనిందోడ్కొనిచను దెంచి రనంతరంబ.

సీ. అక్రూరుఁడమ్మెయి ♦ నమ్మహారత్నంబు
దనకువచ్చిన నను ♦ దినముఁగూడియు
పవిఁడియు మణులు న ♦ ల్పంబు నాత్మోపభో

గమునకుఁ గొనక దా ♦ నములు ధర్మ
ములు హుతంబులు బంధు ♦ పూజనంబులునార్జి
తములుగ జరపుచుఁ ♦ దనరి యెందు
నతులితంబై దాన ♦ పతియనఁ బేరుపరి
ఖ్యాతినొందఁగ నిత్య ♦ యాజనమొకఁడు
కృత్యముగ నిష్ఠతోడ దీ ♦ క్షించియుండె
నలువదియు రెండు నేఁడు లి ♦ త్తెఱఁగుతోడ
నెడపకెప్పుడును మఱియు ♦ నడఁగె నలుపు
లుడిగె భద్రంబు లతిశల్లు ♦ చుండెనుర్వి.

## అక్రూరుఁడు విడిచిపోవుటవలన ద్వారకయం దుత్పాతంబులు పుట్టుట.

వ. అనఘుమ నొక్కతటి దదీయబాంధవులగు భోజులు శతృఘ్నుండను యాదవు వధియించిన.

తే. కలఁక పుట్టి యాదవులలో ♦ నిలువననువు
గాక తానుజొట్టెలుఁ దొలఁ ♦ గంగఁ జనియె
నమ్మహాత్ముఁడతని పోక ♦ యాదిగాఁగఁ
బుట్టె బహుదోషములు యదు ♦ పురమునందు.

వ. అట్టియనావృష్టిమారికాగ్ని వ్యాధాద్యుపద్రవంబులం జూచి వృష్టిప్రముఖులు దమలోనం జింతించు నెడ వసుదేవనందనుండు

క. మున్నెన్నఁడు లేవొక్కట
యున్నయనికిఁ బెక్కుకీడు ♦ లుగ్రమ్ముగ ను
త్పన్నములై తోఁచె యి
ట్లెన్న విధమునకు నిమిత్త ♦ మూహింపఁ దగున్.

వ. ఎయ్యదియేని నొక్కటిలేక యిక్లేలయగునని నంద
కుండను కులవృద్ధుండతని కిట్లనియె.

క. జనమత విను మథురాపురిని
జనకుండు శ్వఫల్కుఁడున్న • జనపదమున సం
జనితంబులుగా వెన్నఁడు
ననుపమ దుర్భిక్ష మారి • కాగ్నిభయంబుల్.

వ. కాశీశ్వరు దేశంబున నవగ్రహపీడ పొడమినం బెద్ద
లు సెప్ప నతండు శ్వఫల్కుంబ్రార్థించి తోడ్కొని
పోయి యద్దురితంబుఁ బాపికొనియెఁ దొల్లి కాశ్యప
త్నిగర్భిణియై సముచిత సమయంబునఁ బ్రసవింపక
పండ్రెండేండ్లు చూలుమోచిన వచ్చెరువునొంది య
ప్విభుండు నిజపరిభావంబునఁ దద్గర్భంబు గూఁతుగా
నెఱింగి తల్లి మాతల్లికిం గ్లేశంబు సేయక వెడలుము భ
వదీయపదనావలోకనంబున నన్నుఁ గృతార్థుం జేయవ
లవదేయనినం గడుపులోనుండి తండ్రిం బేర్కొని.

క. అనుదినమును నేఁడాదిగ
జనఘా యొక్కొక్క మొదవు • నవనిసురున కి
చ్చిన నింకవత్సరత్రయా
మున కేని జనింతుఁ జేయు • ము పదీప్సితమున్.

వ. అనిన నప్పకాకయసి యాయ్యనుష్ఠానంబునడపనకా
లంబునం గన్నియాపుట్టి గోపరిదాన పరిమూత యగు
టంజేసి గాందినియను పేరుగాంచి క్రమంబునం బెరి
గి పెండ్లిప్రాయంబున నున్నది గావున నన్నాతినన్నె
రనాథుండు పరమోపకారియైన యాశ్వఫల్గునకు నొ

సంగ నస్త్రి తండ్రికిం బుట్టిన కొడుకునకుఁ బితృపరిభా
వం బెట్లును లేకుండునే యక్రూరుం డసాధారణగౌ
రవోదారుం డగుగావున.

క. ఆతఁడు దొలఁగిన నెంతయు
భీతికిఁ బట్టయ్యె నిల్లు ♦ పృథివి దగదు ని
త్యాతిశయ గుణుని దెస నొక
యేతావన్మాత్రమునకు ♦ నెగ్గు గణింపన్.

వ. అనినం దద్వచనం బంగీకరించి రథాంగధరుండు తద
పరాధంబు సైరించినవాఁడయి యుగ్రసేనానుమతం
బున నక్రూరుం రావించిన నుపద్రవంబంతయుం బరిశాం
తంబయ్యె నంతం గృష్ణుం డొక్కనాఁ డంతఃపురంబున.

## శ్రీకృష్ణుఁ డక్రూరునిచే నున్న శ్యమంతకరత్నంబు బయలుపఱచుట.

సీ. ఘనుఁడు శ్వఫల్కుని ♦ తనయుఁ డక్రూరుండు
తండ్రిప్రభావంబు ♦ తానుఁ జూపె
ననుట యల్పపుహేతు ♦ నరయ ననల్పంబు
గలదు దుర్భిక్షాది ♦ కలుషమంత
యడఁగు కారణమొక్కఁ ♦ డా శ్యమంతక రత్న
మున్నది యాతని ♦ యొద్దఁ దప్ప
దిది యమ్మహామణి ♦ కిల్బిశాద్భుతభూతి
గలుగుట నందు సా ♦ యాలఘుశీలుఁ
గాక నొకజన్న మొనరించి ♦ యొండుగ్రతువు
తోన తొడఁగఁ గనసప్పృశ ♦ దానగిరము

రొడపడకయుండ పలికెదం ♦ నింతవ్యయము
సేయు నేమెఱుఁగ నిపిరి ♦ చెందనెంచు.

వ. అని యూహించి సమస్త యదువృష్ణి సమక్షంబున
నొండుకార్యంబు పేర నతనింబిలిపించి.

క. ఆపనికిఁదగిన సరసా
లాపంబులఁ గొంత సేపు ♦ లాలితమృదు గో
ష్ఠి పరిణతుఁడై పదపడి
యాపురుషోత్తముఁడు నగుచు ♦ నబ్భోజవిభున్.

వ. దానపతీయని సంబోధించి యుల్లన నిట్లనియె.

చ. సకల జగంబులందుఁ గను
సారము నాఁదగు నుత్కలచ్ఛ్యమం
తకమణి నీకు నిచ్చె శత
ధన్వుఁడు నీవును దాఁచినాఁడ వి
య్యకటిలకత్వ మిర్వురకుఁగల
యంతటికిన్ హితమేను నాత్మ దీ
నికిఁ గడుసంతసిల్లితిని
నిక్క మెఱుంగుదు నింతయొప్పదున్.

క. నీయొద్ద నుండుటయు విను
మాయర్థంబగుటఁ జేసి ♦ మదనెఱిఁగియు నోం
డేయాదియును బలుకము భవ
దీయగుణత్వంబు బహుళము ♦ తిక్షమమగుటన్.

వ. ఈరాహిణేయుండు రత్నవిషయంబైన యవిశ్వాసం
బువలన మాదెసం బ్రసన్నుండు గాకుండు నట్టి దు

తే. జలజనాభు మిధ్యాభిశం ◆ సనవిముక్తుఁ
డైనయిక్కథ చదివిన ◆ ననుదినంబు
వినినఁ దలఁచిన సడిలేక ◆ జనులుసర్వ
దోషరహితులై పొందుచుం ◆ దుఃఖశుభంబు.

శుభమస్తు.

# హరివంశము

## అర్థములు.

---

(1) విమలచారిత్రము–యోగ్యమగుప్రవర్తన, త్రిభువనమిత్రుఁడు=మూఁడులోకములకు హితుఁడు–సూర్యుఁడు (లోకబాంధవుఁడు=సూర్యుఁడు), అమిత్రధ్వంసీ=శత్రువులను నశింపఁజేయువాఁడా! (ఇత్యాది కృతికర్తయగు వేమభూపాలునకు సంబోధన)–శ. అలం. వృత్త్యనుప్రాసము

(2) మూర్త్యంతరము=మూర్తి+అంతరము. మరియొకరూపము, (దేశాంతరము, రాజాంతరము) వెడగ్రభాగంబునన్= అతనియెదుటను, ప్రణతుండై = నమస్కరించినవాఁడై.

(3) నభము=ఆకాశము, దుర్లోకస్ఫురమూర్తిన్= చూడశక్యము గాని విస్తారమైన రూపముతో.

(4) కంఠావలంబియైనన్ =కంఠమునందు వ్రేలాడుచున్నదగుటచే, అనుటయున్ =అనినతోడనే, (వ్యా. వి. 'యు', పూర్వకంబగుభావార్థకములకానంతర్యార్థకమగును). అలుతన్ = మెడయందు.

(5) ఎసకంబెసగన్ =అతిశయింపఁగా.

(7) తేజోనివహము =కాంతిసమూహము.

(8) అర్కోపరి...రత్నుండు=సూర్యునియొక్క యనుగ్రహముచేఁ బొందఁబడిన రత్నముగలవాఁడు, సరోజ ...సఖుండు=తామరకుబంధువగు సూర్యునకు స్నేహితుఁడు.

(9) ఇందుస్యమంతకమణి పరిభావమువర్ణింపఁబడినది. ఐనిర్మల...భారముల్=స్వచ్ఛమైనబంగారముయొక్కయు, మణులయొక్కయూ, బారువులు. (Candy—Measure of 20 Maunds) పొచ్చెము=తక్కువ, ప్రభూతము గాన్=విస్తారముగా, ఉపసర్గము=ఉత్పాతము (తోకచుక్క మొదలగునవి), అచ్చిక=లోభము, ఇచ్చమైన్=ఇష్టముతో.

(10) మానోచితుండు—(పూజార్హుఁడు) ఇవ్విభుండు, కృష్ణుండు, అడుగన్=అడుగఁగాన్, పొరిన్=మాటిమాటికి, తదనుధ్యానము=దానినిగూర్చిచింత, తలకున్=భయపడును.

(11) సన్నవారన్=మెల్లఁగాన్.

(12) విపిన దుర్గంబులన్=చొరరాని యడవులందున్, మహాసత్త్వుఁడు-మిక్కిలిబలముగలవాఁడు, మృగయాతత్పరుఁడై=వేఁటయందాసక్తిగలవాఁడై, తెగిరో=సాహసించిరో

(13) కృష్ణకృత్యము=కృష్ణునిపని, కర్ణపరంపరన్=(చెవినుండిచెవికి) ఒకరినుండి యింకొకరికి, పరివాదము=నింద, లోకవేది=లోకములను దెలిసికొనువాఁడు, వెరవరులు=నేర్పరులు.

(15) బలవత్సింహ...పరికరున్=బలవత్=బలముగలిగిన, సింహవరిష్ఠ=శ్రేష్ఠముగుసింహముచే, పాటిత=చీల్పఁబడిన తను=శరీరముసుఁడి, పరిభ్రష్ట=జారినటువంటి, భూష=అ

లంకాంగములును, అంబర=కట్టుబట్టలును గలిగినట్టియు, ఆకు ల - చెదరిన, కేశపరికరున్ - కేశముల సమూహముగలవానిని, కర=చేతినుండి, స్ఖలిత=జారిన, ఖడ్గున్ =కత్తిగలవానిని, ము క్త...సంస్థున్ - ముక్త=విడువఁబడిన లేక జారిన, పల్యాణ జీనుచే, సంవలిత - చుట్టఁబడిన, గ్రీవ=మెడయందు, శీర్ణ - చెదరిన, కేసర=జూలుకలిగినట్టియు, మృత=చచ్చినట్టి, అ శ్వ=గుఱ్ఱముయొక్క, ప్రాంత - సమీపమందు, సంస్థున్ = ఉన్నట్టివానిని, రజః-ధూళిచే, కలుష=మురికిపడిన, శ్మ శ్రు - మీసముగల, ముఖున్ - ముఖముగలవానిని,క్రవ్యాద= రాక్షసులచే, సంవేష్టితున్ = చుట్టబడినవానిని, పరిసేనున్, కవియెన్.

(16) ఋక్షపదంబులు=ఎలుఁగుయొక్క పాదములు, స ర్వేక్షణీయము - అందరిచేఁ గోరఁదగినది, ధాత్రి-దాది, బుజ్జనంబునయందున్=బుజ్జగింపునందు. వ్యా॥వి॥ నకారమి చ్చట "అందు" పరమైనను వచ్చెను.

(17) జాంబవన్నిహతము-జాంబవంతునిచేఁ జంపఁబ డినది.

(18) అనంతద్యుతిమూర్తము - అంతములేని కాంతులచే త నూతనమయినదియు.

(21) బాహా=బాహువులయొక్క, బంధుర=దట్టమైన, వ్యూహన=రచన, (ఎగుటివానిని బట్టుటకుఁ జేతులఁజాచుట) యొక్క, ఉద్ధతిపైన్ - ఆడంబరముతోన్, పటు...బలంబు నన్ = పటు = బలమయిన, భుజ = బాహువులయొక్క, వ్యాఘాత - దెబ్బలనెడి, నిర్ఘాత = పిడుగులయొక్క, సంప తన - పడుటచేత, అఖిల=భయంకరమయిన, బలంబునన్ =

బలముతో, తోడరేన్ = ఎదుర్కొనెను. ఏకవింశతిసంఖ్యా - ఇరువదియొకటియను సంఖ్యతో, కలిత = కూడుకొన్న, అహముల్ = దినములు.

(22) బలదేవ + అనుజుఁడు - బలరామునితమ్ముఁడు.

(23) నిర్విలోపతన్ - లోపములేకుండునట్లుగన్, ఆప్యాయనమున్ - తృప్తిని, విహిత .దానములు - చేయఁబడిన విస్తారమయిన తిలపిండదానములు

(24) ప్రబలసంప్రహార ఖేదంబు = దట్టమగు దెబ్బలయొక్క బాధ.

(25) భుజంగములు - నాగులు, ద్యుచరులు = అంతరిక్షమందుసంచరించువారు (ఖేచరులు), పరిభావము = తిరస్కారము, తిర్యగ్భవులు - పశుపక్ష్యాదులు, ప్రాప్త = పొందఁబడిన పునస్సముద్భవునిగాన్ = పునర్జన్మ కలవానినిగాన్. అలం. కావ్యార్థాపత్తి.

(26) ఆత్మావతరణము = తనయొక్క యవతారము.

(27) ఆయతసమరశ్రమము = విస్తారమైనయుద్ధమునందలిప్రయాసము.

(28) పరివాదపరిహారార్థంబు - నిందపోవుటకొఱకు, అర్థవిదుండు = నీతితెలిసినవాఁడు.

(30) సమ్మదస్ఫారతన్ = సంతోషాతిశయముతో, ఎలప్రాయము - యౌవనము.

(32) మిథ్యాభిశంసనశమనంబు = అపవాదయొక్క శాంతిని.

(33) ఆనతుఁడై—నమ్రుఁడై.

(34) మంతనంబు—రహస్యాలోచన.

(36) ఉటంక=లక్ష్యపెట్టక.

(37) జతుగృహము—లక్క, యిల్లు, ధర్మవేది—నిజమును దెలిసికొనువాఁడు.

(38) అనఘరాగజంబు—విలువలేని, యోగ్యమైన, పొగడఁదగిన, శ్రేష్ఠమయినమాణిక్యము.

(39) ఉమ్మలికంబు=దుఃఖము, హలాంకుతోడన్=బలరామునితోన్.

(40) పెను + ప్రాపు=గొప్పయాధారము.

(41) అసురీ—రాక్షసస్త్రీలయొక్క, హార=ముత్యాలహారములనెడి, మృణాల—తామరతూండ్లకు, హంసము=హంసయైనట్టియును, మహేంద్రి—ఇంద్రునియొక్క, అంతఃపురీ—అంతఃపురస్త్రీలయొక్క, కర్ణపత్త్ర—కర్ణాభరణములయొక్క సముజ్జ్వలన—ప్రకాశించుటకు, మూలశిల్ప=ముఖ్యమగుకమసాలిగానట్టియు కుమత—దుర్మార్గులనెడి, ధ్వాంత—చీకటికి, అర్కబింబంబు=సూర్యబింబమైనట్టియు, దైత్యరిపుసహాయంబు—సహాయశస్త్రముగానట్టియు (అగు) విష్ణుచక్రము. ప్రత్యర్థి శత్రువై. అలం రూపకము.

(42) విపక్షుండై=విరోధివాఁడై.

(43) లసత్తురగనితంబిని=ప్రకాశించుచున్నయాడగుఱ్ఱము

(44) సహాగ్రజుఁడై=అన్నతోఁ గూడుకొన్నవాఁడై,

అపక్రాంతుఁడు=పరుగెత్తిపోవువాఁడు, ఉద్భ్రాంతతన్=భయముచేన్.

(45) కడువెసమైన్=మిక్కిలి వేగముగాన్.

(46) విమతుఁడు=శత్రువు.

(49) విటపంబు—వృక్షము.

(51) తృష్ణ—ఆశ, ఇట్టిఁడు=ఇట్టివాఁడు —వ్యా. వి. (అట్టి ఇట్టి ఎట్టి శబ్దముల సమాసమందు తచ్ఛబ్ద వకారమువాఁడు) వకులోపము. ఇట్లే అట్టిఁడు, ఎట్టిఁడు.

(52) సాంత్వనంబులు=బ్రతిమాలుకొనుటలు, తత్సదనంబునన్=అతనియింటియందున్, రథ్యము=గుర్రము.

(53) మహాదుర్గమసత్త్వన్=గొప్పదైన, అణచుటకశక్యముకాని బలముగలవానిన్, సాత్వతాగ్రణిన్=సత్వగుణముకలవారిలో శ్రేష్ఠుని, దామోదరపూర్వజున్=కృష్ణునకన్నయైనవానిన్.

(54) సవిశేషార్చనాతోషితున్= సవిశేష-సాధారణముకాని, అర్చనా=పూజలచే, తోషితున్=సంతోషించినవానిన్, ఆచార్యుఁడు=గురువు.

(55) అమ్మెయిన్=ఆరీతిగాఁ, ఆత్మ + ఉపభోగము=తనయొక్క యనుభవము, హుతంబులు—హోమములు, ఊర్జితముగన్=చక్కఁగన్, అతులితంబు=సాటిలేనిది, యాజనము=యజ్ఞము, ఒకఁడు-ఒకటి, కృత్యము—చేయవలసినపని, మారి=ఒకవిధమైనరోగము, భద్రము=మంగళము.

(57) కలఁక=కలహము, చుట్టలు=(రూ. చుట్టాలు, చుట్టములు).

(59) ఒక్కట యొక్కయూనికిన్ = ఒక్కమాటుగాన్ (Suddenly.)

(61) జనపదమునన్=దేశమునందున్, సంజనితములుగావు=పుట్టవు, అనుపమ...ంబుల్=సాటిలేని దుర్భిక్షము, మారి, అగ్నిభయము.

(62) అవగ్రహాపీడ=వర్షము లేకపోవుటవల్లఁ గలిగిన బాధ, భవదీయ=నీసంబంధమయిన, వదన=ముఖముయొక్క అవలోకనము=చూచుట, మొదవు=ఆవు, అవనిసురునకు=బ్రాహ్మణునకు, వత్సరత్రయము=మూఁడుసంవత్సరములు, మదీప్సితము=నాకోర్కె, కాశ్యపత్ని=కాశిరాజుయొక్క భార్య, గోప్రదానప్రసూత=గోదానము చేయుటచేపుట్టినటి అసాధారణ=సామాన్యముకాని, గౌరవముచే, ఉదారుఁడు=గొప్పవాఁడు.

(65) ఏతావన్మాత్రము=ఇంతమాత్రము, ఎగ్గు-కీడు.

(66) రథాంగధరుఁడు-చక్రధరుఁడు (కృష్ణుఁడు) ఇతనిచక్రమునకు సుదర్శనమని పేరు. ఉపప్లవము=ఉపద్రవము

(67) అల్పప్రహేతువు=స్వల్పమయినకారణము, అనల్పము=గొప్పది, దుర్భిక్ష + ఆది + కలుషములు=కరువుమొదలుగాఁగల బాధలు, ఈదృశ + అద్భుత + భూతి=ఇట్టియాశ్చర్యకరమగు ప్రభావము, ఓలిన్-క్రమముగాన్, తోన తొడఁగెడున్=వెంటనే ప్రారంభించును, ఎడపడక=విరామములేక.

(68) ఒందుకార్యంబు=వేరొకపని.

(69) సరస + ఆలాపములు=రసవంతములగు మాటలు, లాలిత + మృదు + గోష్ఠీ + పరిణతుడు= మనోహరమైనట్టియు, సరళమగునట్టియు, సల్లాపమందు నేర్పుగలవాడు, భోజవిభుని=(అకూరుడని) భోజవంశపురాజుని.

(71) కడుసారము నాదగు నుజ్జ్వలత్స్యమంతకమణి= మిక్కిలిసారముగలది ని ప్రసిద్ధిజెంది ప్రకాశించుచున్న స్యమంతకమణి, అకుటిలకర్మ=యోగ్యమగుకార్యము.

(72) భవదీయగురుత్వంబు=నీసంబంధమైనగొప్పతనము బహు + మతి + క్షమము=అందరియొక్క మనస్సులకు నిష్టమయినది.

(73) రౌహిణేయుడు= బలరాముడు, రోహిణిపుత్రుడు, ప్రసన్నుడు=దయగలవాడు, పరిష్కృవిచారుడు =మంచియోచనగలవాడు.

(74) అతులితమణి=సాటిలేనిరత్నము, పతత్క్లేశము= ఎడతెగనిశ్రమ.

(75) భవత్ + ఈక్షిత + అర్థ + కృతి + అ=నీచేఁగోరబడిన ప్రయోజనముయొక్క నెఱవేర్పుటయే.

(76) అధిక సుఖ ప్రసన్న హృదయులు=విస్తారమయిన సుఖమునకు స్థానమయిన మనస్సుగలవారు, సత్ + అభిమత + చరిత్ర=మంచివారిచే బొగడఁదగిన చరిత్రగలవాఁడా

(77) కాంచనసంపుటంబు=బంగారపుపెట్టె, మధ్యందిన అర్క తేజః విరాజితంబు=మధ్యాహ్నకాలమందుండు సూర్యునియొక్క తేజస్సువలె ప్రకాశించునట్టిది, ప్రభావి-